# శ్రీ యోగేశ్వర

## శతకము మరియు దివ్యసందేశములు

రచయిత:

పరమహంస శ్రీయోగేశ్వరానంద స్వామి





శ్రీ యోగేశ్వర ఆశ్రమ గురుకుల విద్యాపీఠము

పోస్టు: పిప్రి-503 221.

మం॥ ఆర్మూర్, జిల్లా: నిజామాబాద్.

మా ప్రచురణలు

శ్రీ యోగేశ్వర తత్వామృతము

శ్రీ యోగేశ్వర భజనమాల

శ్రీ యోగేశ్వర సులభ కైవల్య భోదామృతము

శ్రీ యోగేశ్వర శతకము

శ్రీ దైవ యజ్ఞ విధి

శ్రీ మద్భగవద్గీతామృత సారము



ఓం  卐

ఓం శ్రీయోగేశ్వర కృష్ణ విశ్వ పరబ్రహ్మణే నమః

ఓం నమోభగవతే వాసుదేవాయ

# శ్రీ యోగేశ్వర దివ్య సందేశములు

1. నేనెవరు? ఎక్కడనుండి వచ్చాను? ఎక్కడకు వెళ్తాను?
2. ప్రపంచమే ఒక దుఃఖాలయం.
3. ప్రపంచమే నీ ఇల్లు. ఇతరులకు మేలు చేయడం నీమతం.
4. మానవ జీవితం నీటి బుగ్గవంటిది.
5. జీవితమే ఒక యుద్ధరంగము.
6. జగత్తు బీరకాయ పీచులాంటిది.
7. జీవితం, ఇదొక్క విచిత్ర ప్రయాణం.
8. శరీరము శవముతో సమానమైనది.
9. మానవ శరీరము భగవంతుని సేవించుటకు వచ్చినది.
10 కాలం చాల అమూల్యమైనది-చాల కఠోరమైనది.
11. గడచిన కాలం-జారినమాట-విడచిన ప్రాణం-తిరిగిరావు.
12. గతాన్ని చింతిస్తు కూర్చోకు-వర్తమానంలో చరిస్తు భవిష్యత్తుకు బంగారు-బాట వేయు.
13, ప్రాణం-జీవితం-సంపద-ప్రపంచము-చంచలమైనవి, కాని ధర్మంఒక్కటె అచంచలమైనది.
14. జీవులన్నింటిలోను మానవుడు ఉత్తమోత్తముడు.
15. బ్రతుకంటె ఆశ-చావంటెభీతి-ఎవరికి లేదో వారే మహాత్ములు.
16. మన తప్పులను వెదకి మనకు తెల్పువారే మనకు గురువులు.
17. సద్గురువు యొక్క సహాయము గైకొనినచో సంసారవనము నుండి బయట-పడెదవు.

18. సంసారము వెంటరాదు-సంస్కారము వెంట వస్తుంది.

19. నావచేత సముద్రమును దాటునట్లు-విచారజ్ఞానముచే సంసారము దాట వచ్చును

20. ఆశకు ఆకలి ఎప్పుడు తీరదు-దాని నోరు అకాశమంత పెద్దది. దాని కడుపు సముద్రమంత విశాలము

21. తామరాకువలె సంసారములో యుండుము. కాని సంసారివి కాకు.

22, ఈ సంసార సుఖమెట్టిది? సంసార సుఖము గజ్జికరణిని గోకి నందువల్ల కల్గు సుఖం వంటిది.

23. మెల్ల మెల్లగా సంసారమును ని మనస్సు నుండి ప్రక్కకునెట్టు.

24. ప్రపంచములో తిను-పరమాత్మలో జీవించు.

25. ప్రతిదినము అన్నము భుజించిన విధముగా, ప్రతిదినము సత్సంగము అవసరము

26 తినుటక్తై జీవించువాడు బద్ధుడు-జీవించుటక్తై తినువాడు ముక్తుడు.

27. రసములను జయించినవాడు-జగత్తును జయించినవాడె.

28. రసవత్తమైన బోజనము చేయువానికి-భజన నిరసముండును.

29. జగత్తు చెడపోలేదు-మానవుని దృష్టి-బుద్ధి-మనస్సు-చెడినది.

30. కనిపించునది యంతయు నశించిపోగలదు.

31. భోగములు సంసార మహా రోగములు.

32. లౌకిక సుఖములో జిక్కుకొనిన వ్యక్తి భగవంతుని భజింపలేడు.

33. పరమాత్మను మరచినవారు-ఏస్థలమందున్నను అశాంతితో నుందురు.

34. ఆనందం నీలోనుండి వచ్చేది-దుఃఖము బయటినుండి వచ్చేది.

35. శరీరము బాగున్నప్పుడు-మృత్యువు దూరముగా యున్నప్పుడు ఆత్మకళ్యాణము గావించుకో.

36. భగవద్గీత నీ నొసటి గీతను మారుస్తుంది.

37. జనన మరణములు లేనిది ఆత్మ

38. సర్వజీవుల ప్రేమయే-సర్వేశ్వరుని పూజ

39. భావ శుద్ధియే జ్ఞానసిద్ధి

40. పరమాత్మను మరువని వారికి ప్రపంచము లేదు.

41. సర్వత్ర దేవుని గాంచువారే నిర్భయులు

42. స్వార్థ రహిత సేవా స్వామికి ప్రీతి

43. ఏకాగ్రత మించిన తపస్సు లేదు

44. రాగాదుల నిర్మూలనకై చిత్తమును తపింపజేయుటయే తపస్సు.

45. రాగం కన్న దుఃఖము లేదు-త్యాగముకన్నా సుఖము లేదు

46. రాగద్వేష రహితముగా చేయబడు వ్యవహారము ముక్తినిప్పించును.

47. నన్నెవ్వడు వెంటాడునో నేనతని వెంట పడుదును.

48. నీవు భగవంతుని వెంటపడిన యెడల-జగత్తు నీవెంట బడును.

49. భగవంతుని వెంట బడని వానినే మాయ బాధించును.

50. మాయ మహా ప్రమాదకరమైనది-సదా జాగరుకుడై యుండవలెను.

51. శ్రద్ధా విశ్వాసములు గలిగి యుండుము-సంశయములను పారద్రోలుము

52. శ్రద్ధ గల వారికి జ్ఞానము కలుగును.

53. భక్తిరంగు శీఘ్రముగానంటదు. – యంటినచో సాంసారిక ప్రవృత్తులపై వైరాగ్యము కల్గును.

54. పాపక్షయము కానంత వరకు జీవుడు పరిశుద్ధుడు కాడు.

55. తనను తానె ఉద్ధరించు కోవలెను.

56. పుణ్యము చేయకున్న బాధలేదు-కాని పాపము నెప్పుడు చేయకు.

57. మనోబలహీనతయే దురలవాటుకు కారణము.

58. సద్భావాలలో నీవు జీవితం గడిపితె నీడలాగ సుఖం నీ వెంట నంటి వస్తుంది.

59. పవిత్రత-సహనము-పట్టుదల జీవన ప్రధాన సూత్రములు,

60. జీవుడు భగవంతుని పాదముల నాశ్రయించి నప్పుడు కృతార్థుడగును.

61. విషయముల చింతించు చున్నచో ఆత్మశక్తి నష్టమగును.

62. మౌనముగా నున్నందున మాయా బంధము తొలగి పోవును.

63. మాటలలో నీశక్తిని వ్యయ పరచకుము-నిశ్శబ్దముగా ధ్యానమొనర్చు.

64. ఆత్మనియమం కావాలంటె-ఆహార నియమము అవలంభించాలి.

65. స్థూల శరీరానికి తినేదిమేత సూక్ష్మ శరీరానికి వినేదిమేత.

66. మిత భాషణ-మితఆహారము-మితనిద్ర-కలిగియుండవలెను.

67. దైవ మార్గము ననుసరించుటకు వాయిదా పనికిరాదు.

68. ఊగులాడితే జీవుడు-ఊరుకుంటే దేవుడు.

69. జీవుడు తలచినచో నిద్రించును-భగవంతుడెప్పుడు నిద్రించడు.

70. ఆతురత లేనివానికి భగవంతుడు లభింపడు.

71. జ్ఞాన నిష్ఠలో అరూఢ స్థితి పొందువరకు అనుష్ఠానము విడువరాదు.

72. ప్రపంచములో కదలకుండ నున్న వస్తువు ఒక్కటే. అదియే పరమాత్మ.

73. తనమనస్సును శిక్షించినచో యముడు నీకు దండన నివ్వడు

74. కామము–క్రోధము–లోభము ఇవి నరక ద్వారములు

75. శ్రీమంతుడెవ్వడు? సదా సంతోషించువాడు, దరిద్రుడెవ్వడు ఆశగొప్పగానుండువాడు.

76. తృప్తి భోగములో లేదు–త్యాగములో కలదు.

77. పాలచె పెరుగగును–కాని పెరుగుపాలు కావు.

78. బ్రహ్మచర్యము పాలించి బలవంతుడవు కమ్ము.

79. శాంతితో గూర్చుండి నీ వాత్మ స్వరూపమును చింతింపుము.

80. నిరంతరము సాధన సాగించుము–దానంతట అదేజ్ఞానోదయం సిద్ధించు.

81. మానవ సహాయము కంటె–పరమేశ్వర సహాయము గొప్ప.

82. దేవుడు చేసినది ప్రకృతి–జీవుడు చేసినది వికృతి.

83. గాఢమైన నిశ్శబ్దమునందే భగవద్వాణి వినిపించును.

84. నిజమైన ఆనందము నీలోనే గలదు.

85. ఎన్నిక్లిష్ట పరిస్థితులేర్పడినా ధ్యానానికి కొంత సమయమునిమ్ము.

86. నిద్రకొరకు పరుండువాడు సంసారి–నిద్రవచ్చినప్పుడు పరుండువాడు సన్యాసి

87. మానవుని పాపమే వానిని జంపును,

88. కొనేది వంకాయ–కొసరేది గుమ్మడికాయ.

89. రోగముతో గూడిన బ్రతుకు ఎటువంటిదో–శాంతిలేని జీవితము అటువంటిదే

90. ఎవరు చేసిన కర్మ వారే అనుభవిస్తారు.

91. నీ స్థితికి నీ గతికి నీభావాలే కారణం.

92. దృష్టి బాగుపడినచో–సృష్టి బాగుపడును.

93. శరీరములు అనేకము–ఆత్మ ఒక్కటే–నక్షత్రములు అనేకము–ఆకాశమొక్కటే

94. దీర్ఘ జీవితముకంటె–దివ్య జీవితమే శ్రేష్ఠము.

95. దాస్యభావము వలన జీవితము బాగుపడును.

96. వ్యాధి శరీరముకు వచ్చును–కాని ఆత్మకు గాదు.

97. మానవుని పునర్జన్మ యొక్క సంసిద్ధత ఈ జన్మలోనే చేయును.

98. నీవు ఇవ్వనిదే నీ కెవ్వరున్ను ఇవ్వరు-నీవు అడగనిదే నీకేదియు నివ్వరు.

99. భగవంతుని ప్రేమించువారే నిజమైన జ్ఞానులు.

100. తీవ్రనిష్ఠగల వారికి మోక్షము దగ్గరలోనె గలదు.

101. నేనొక్కనినేలేను నా భగవంతుడు కూడా నావెంటనున్నాడు.

102. తననే గుర్తింప లేనివాడు-భగవంతునెట్లు గుర్తించును.

103. భక్తుల వంధనమే భగవంతునికి బంధనము.

104. దైవమే సర్వం అనుకుంటె బాధయే లేదు.

105. ఆనందము బాహ్య సుఖముల యందు లేదు తనలోనే యున్నది.

106. శ్రీ భగవానుని దర్శించుటకే మనుష్యజన్మ వచ్చినది.

107. అన్ని ప్రాణులయందు భగవానుని దర్శించుము.

108. భోగి యోగి యగుటకు ప్రయత్నించినచో రోగియగును.

109. గృహమందుండుట పాపముకాదు-కాని లోపల యుండుట పాపము.

110. భగవానునికి వందనము శరీరము చేతనేకాదు మనస్సుతో గూడా చేయవలెను.

111. ఏడు దినములలో ఏదేని యొక్క దినము మృత్యువు నిశ్చితమే.

112. నిరంతరము మృత్యువు భీతియున్నచో పాపకర్మలు చేయడు.

113. లౌకిక వస్తువులపై స్మృతి యున్నంత వరకు ఈశ్వరుని యందా సక్తి యుండదు

114. పవిత్రముగా నెల్లప్పుడు మనస్సునుంచు కొనుము.

115. ప్రాతఃకాలము-మధ్యాహ్నము-రాత్రి-భగవానుని ప్రార్థించుము.

116. భగవానునికి నీ సర్వస్వము నర్పించుము-పిదపతన సర్వస్వము నిచ్చును.

117. ప్రభునామము జపించిన తర్వాత పనులన్ని చేసుకొనుము.

118. అంత్యసమయమున చేసిన పాపములే జ్ఞప్తికి వచ్చుచుండును.

119. అజ్ఞానము-అభిమానములే-దుఃఖమునకు కారణమగును.

120. శ్రీ యోగేశ్వర భగవానుడు నీవెంట యున్నాడని సదా తలంచుము.

121. అంతిమశ్వాస వదిలే వరకు భగవానుని నామము జపించుము

122. ఎవరి దోషములను, పాపములను విచారించకుము.

123. ఎల్లప్పుడు సావధానముగ నుండవలయును-అట్లుండువాడె సాధువు.

124. పాపకార్యము జరుగు దినమున ఉపవాసము చేయుము మరల జరుగదు.

125. వర్తమానము మాత్రము చక్కబరచు కొనుము గడచినది స్మరించకుము.

126. తృప్తిభోగములందు లేదు-కాని త్యాగము నందున్నది.

127. ఇంద్రియములనేడి పుష్పములను ఈశ్వరున కర్పించుము.

128. భోజనము చేయుట పాపము కాదు-కాని భగవానుని మరచి యుండుట పాపము

129. భోజనము శుద్ధముగ నున్నచో సద్గుణములు బుద్ధి స్థిరమగును.

130. భగవదర్పణము చేయక భుజించెడివాడు చోరుడే యగును.

131. పుస్తకముల వెంట నుండు వాడు పండితుడగును భక్తిచే భకవంతుని వెంట నుండు వాడు సాధువగును.

132. ఆత్మ పరమాత్మల కలయికయే పరమానందమగును.

133. ధ్యానకర్త ఏస్వరూపమును ధ్యానించునో అస్వరూప శక్తియే కలుగును.

134. ప్రేమచే భగవానుని స్మరించినచో అదే నిజమైన భక్తి అదే ప్రేమ.

135. భగవానుని కన్న గొప్పవాడు భగవద్భక్తుడు.

136. తల్లిదండ్రుల సేవ నీవు చేసినచో వృద్ధాప్యమున నీతనయులు నీ సేవచేసెదరు

137. మనస్సునందు వాసన చేతనే కామము చేయును.

138. మానవునికి శత్రువు బయట లేడు-మనస్సులోనే యున్నాడు.

139. పరిశుద్ధ భావమే మని గొప్ప తపస్సు వంటిది.

140. ప్రేమతో పరమాత్మను పిలిచినచో పరుగెత్తి వచ్చును.

141. బాలురలు చలన చిత్రములు చూచుటకు పంపించెడి తల్లి తల్లిగాదు శత్రువు

142 శ్రద్ధతో సాధన చేసెడివారికి సిద్ధి లభించును.

143 దృఢ నిశ్చయమున్నచో భగవానుడు తప్పక సహాయకుడగును.

144. సత్కార్యము చేయుటకు సంకల్పించినవారికి భగవానుడు శక్తినిచ్చును.

145. జపము వలన పాపము నశించును.

146. పాపము నశించనంత వరకు పరిశుద్ధుడుకాడు జీవుడు.

147. సంపద, సంతానము పూర్వ ప్రారబ్దాను సారమే లభించును.

148. పుణ్యమును మరచిపొమ్ము-కాని పాపమును జ్ఞప్తియందుంచుకొనుము.

149. సంసారమును సత్యమని తలంచినచో మోహమభివృద్ధియగును

150. జగత్తు మిథ్యయని తలంచినచో వైరాగ్యము కలుగును.

151. మనస్సుకు పాపము జేసెడి అవకాశమును ఈయకుము.

152. జ్ఞానియగు పురుషుడే వస్తువును సంగ్రహించగూడదు.

153 మహాపురుషుల సేవ ముక్తికి మార్గము.

154. మనస్సుకు బుద్ధినుండి–బుద్ధికి పరమాత్మనుండి శక్తి లభించును.

155. గొప్పనైన వైరాగ్యము గృహమునందే సంపాదించుము.

156. నీ మనస్సును నీవే స్వాధీనమునందుంచు కొనగలవు

157 నామము నాశ్రయించినవారికి-నీటిలో నావ నాశ్రయించి నట్లుండును.

158. నడుచునప్పుడు అడుగడుగున భగవన్నామమును స్మరించుము.

159 అధికారియైన గురువుచే మంత్రగ్రహణము చేసినచో దివ్యశక్తి వచ్చును.

160 కష్టము నష్టము జరిగినచో హా! హా! యని పలుకక హరిహరి యనుము.

161. గురువు అనుగ్రహము లేనిచో భగవద్దర్శనము కాదు.

162. నిద్రనుండి లేచినప్పుడు భగవానుని ప్రార్థన భూమికి నమస్కారము చేయుము

163. సర్వసుఖసాధనము ధనము కాదు ధర్మమేయగును.

164 వైరాగ్యము దృఢమైనచో సన్యాసము తీసికొనుము.

165. పుట్టకముందు అతనికి బంధువుల సంబంధం లేదు-మరణించిన పిదప గూడ లేదు

166. పరుల దోషములను చూడకుము-తన దోషములనే చూడుము.

167. సమస్త దివ్య సద్గుణము లెవనిలో నుండునో అతడు భగవానుడగును.

168. రాముని యొక్క ఒక్కొక్క సద్గుణము జీవనమున నుపయోగింప ప్రయత్నించు

169. తల్లి దండ్రులు లక్ష్మీనారాయణ స్వరూపులు కావునవారికి వందనము చేయుము

170. స్త్రీతన పతిని దప్ప ఇతర సత్పురుషుల పాదుచరణములను గూడ స్పర్శించ వలదు, దూరముగ నుండి వందనము చేయవలెను.

171. గొప్పవారి యొక్క హృదయమునెప్పుడును దుఃఖింపజేయకుము.

172. ప్రారబ్దము ననుభవింపవలయును కాని నూతన ప్రారబ్దము సిద్ధము కాకుండా చూచుకొ.

173. నీవు జనుల ప్రేమించినచో జనులు నిన్ను ప్రేమించుదురు.

174. తాను చేసికొనిన కర్మలే తనకు సుఖదుఃఖముల నిచ్చును.

175. చేసిన కర్మఫలము ననుభవింప వలసియుండును.

176. నేత్రములు తెరచియుండగనే సమాధి కలిగినచో అదియధార్థమగు సమాధియగును.

177. అన్ని దానముల కన్న అన్నదానము మిన్న

178. భార్యభర్తల సంబంధము విలాసము కొరకుగాదు-భగవానుని భజించుట కొరకు

179 అధికారికి భగవానుని ప్రథమ దర్శనము స్వప్నము నందే కలుగును.

180. మనుష్యుడు సాధన చేసినచో ఈశ్వరుడు సహకరించును.

181. జీవన కాలమున ముక్తి లభించనివానికి మరణించిన పిదప ముక్తి లభించుట కష్టము.

182. భోజనము నందునియమము పెట్టుకొనును-కాని భజన యందు పెట్టుకొనడు.

183. పూర్వజన్మ సంస్కార వాసనలు నశించినచో కర్మయందానందము కలుగును.

184 మహాపురుషులు సాధువులు కృపజూపునపుడు పాపవాసన దూరమగును

185 వస్తువును జూచెడివాడు జీవుడు-భావమును చూచెడి వాడీశ్వరుడు

186. మనుష్యుడంతిమ శ్వాసవరకు గూడ మనస్సునందు విశ్వాస ముంచవలదు

187. అజ్ఞాన కారణమున నేది కనిపించదో అది జ్ఞానముచే గనిపించును

188. సత్కర్మకు భగవంతుడు నన్ను నిమిత్తముగా చేసినాడని చెప్పుకొనుము-కాని నేనేయని చెప్పకు.

189. మనస్సును కడుగుటకు బయటినీరు ఉపయోగమునకు రాదు-కాని నేత్రముల నుండి వెడలునట్టి ప్రేమాశ్రువుల చేతనె మనస్సు శుద్ధమగును.

190. ఇతరుల నేడిపించి సుఖము ననుభవించెడివాడు కంసుడు.

191. అధికముగ చదువుటకంటె చదివిన దానిని జీవనమున నుపయోగించుట మంచిది.

192. ఒకసారి త్యాగము చేసిన విషయ సుఖ వాంచను మరల కోరుకొనకుము.

193. దయాళువగు పరమాత్మను జీవుడు ప్రేమింపకుండుట-ఇదె దుఃఖదాయకము

194 వినయమున్న చోటికి వివిధ సద్గుణములు వచ్చును—అభిమానమున్నచో అనేక దుర్గుణములు వచ్చును.

195. మనుష్య జన్మము దుఃఖము ననుభవించుట కొరకే వచ్చినది.

196. జపధ్యానములు చేయనిదే పాపవాసనలు వదలి పెట్టవు.

197. మనుష్యుడు ప్రతిదినము 21600 శ్వాసలు తీసుకొనవల్సియుండును-కావున ప్రతి శ్వాసతో భగవన్నామమును స్మరించుము.

198. ఇంద్రియములకు దాసుడవై వివాహమును చేసికొనకుము-జితేంద్రియుడవై చేసికొనుము.

199. పేదవాడగుట తప్పుకాదు-పేదవానిలో భగవానుని మరచి పోవుట తప్పు.

200. మృత్యుచింతన ప్రతి దినము చేసినచో మనుష్యునకు పాపము చేయునట్టి యిచ్ఛయే యుండదు.

201. సాధుపుణ్యస్మరణ-భగవంతుని భావన నిన్ను పాపము చేయనీయదు.

202. సిద్ధాంత జ్ఞానమందరికి నుండును-కాని జీవనములోనికి తెచ్చుకొనెడివాడు పుణ్య పురుషుడు.

203. సంపదలో పొంగి పోవలదు—విపత్తులో దుఃఖంపదగదు.

204. సూర్యునివలె పరోపకారము చేయుము కాని అభిమానముండవలదు.

205. మనుష్యుడు పూనుకొనినచో నరుని నుండి నారాయణుడు కాగలడు.

206. జిహ్వను తన స్వాధీనము చేసికొనిన వాడన్నింటిని జయించును.

207. నిందస్తుతుల వలన బాధజెందని వాడే నిజమైన భక్తుడు.

208. జగత్తును ప్రసన్న పరచుట కష్టమగును-కాని భగవానుని ప్రసన్న పరచుట కష్టము గాదు.

209 ప్రపంచములో తన వెంబడ ఎవరు రారని అందరికి తెలిసిన విషయమే.

210. పరబ్రహ్మవిచారము చేయుటయే సత్యము-శ్రేష్ఠధనమే ధర్మము.

211 ఇంద్రియములను స్వాధీనము చేసికొనినవాడే ఈశ్వరుడు

212. మోక్షతత్త్వమును తెలిసినవాడే నిజమైన పండితుడు.

213. సమస్త వాంఛలయొక్క త్యాగమే తపస్సు.

214. పదమూడు కోట్ల జపము చేసినచో జీవేశ్వరుల కలయిక జరుగును.

215. యోగ బలముచే యోగేశ్వరునిలో చేరును.

216, దయగల హృదయమే శ్రీ యోగేశ్వర నిలయము.

* హరిః ఓం తత్ సత్ *